THE ANDHRA PATRIKA, MADRAS.



# ఆంధ్రపత్రిక



Regd. No. M. 1118 సంపుటం 38. సంచిక 168 FOUNDER : DESODHARAKA K. NAGESWARA RAO. బుధవారం 19-9-1951 వెల 1 అణా, పైకి 0-1-2.

# తమిళ కాంగ్రెస్ అంగీకారతీర్మానానికై ప్రధాని నెహ్రూ నిరీక్షణ

## రాష్ట్రనిర్మాణ సమస్యపై అది అందగానే అధికార ప్రకటన

### వినోబాభావేకు రాజేన్‌బాబు తెల్పినవిషయం: స్వామిజీకితంతి

[ఆంధ్రపత్రిక ప్రత్యేక విలేఖరి]

గుంటూరు, సెప్టెంబరు 18: ఆంధ్రరాష్ట్రం నిర్మాణం విషయమై అంగీకారం తెల్పవలసిన పక్షాలలో ఒకటిమాత్రం (తమిళనాడు కాంగ్రెసు) యింకా సమాధానం పంపలేదనీ, యిందుకోసమే ప్రధాని నెహ్రూ నిరీక్షిస్తున్నారనీ, అధ్యక్షుడు డా॥ రాజేంద్రప్రసాద్ తమకు చెప్పారని ఆచార్య వినోబాభావే స్వామి సీతారాంకు తంతివార్త పంపారు.

పైన వుదహరించిన పార్టీ అంగీకారం అందగానే ఆంధ్రరాష్ట్రవిభజనను గూర్చి భారత ప్రభుత్వ ప్రకటన వెలువడ గలదని కూడా రాజేన్‌బాబు చెప్పినట్లు వినోబాగారు తమ తంతిలో పేర్కొన్నారు.

నెహ్రూవద్దనుండి నిన్న వచ్చిన తంతిలో ఆంధ్రరాష్ట్ర స్థాపన విషయంలో యిదమిద్ధమైన హామీ ఏదీ లేదనే కారణంగా స్వామి సీతారాం ప్రభృతుల ప్రాయోపవేశదీక్షావిరమణం జరుగబోవటంలేదు.

నెహ్రూగారుపంపిన తంతినిగూర్చి వివరంగా తెలుసుకోవటానికి అన్నాప్రగడ కామేశ్వరరావుగారు మదరాసుమీదుగా ఢిల్లీకి నిన్న ప్రయాణమై వెళ్లారు.

#### ఆంధ్ర నాయకులకు స్వామిజీ సలహా

ఈ సమయంలో వివాదాలకు దారితీసే అంశాలపై ప్రసంగాలకు పూనుకొని, వ్యతిరేకవాదులకు అవకాశం కల్పించక, ఆయాఅంశాలపై నెహ్రూ

(2-వ పేజీ చూడుడు)

#### 'మీతపస్సు ఫలించాలి'

స్వామీజీకి శ్రీ జయప్రకాశలేఖ

మద్రాసు, సెప్టెంబరు 18: సోషలిస్టుపార్టీ నాయకులు జయప్రకాశ నారాయణగారు స్వామి సీతారాంకు ఈ విధంగా ఒక జాబు వ్రాశారని తెలుస్తోంది:- "మీరు ప్రాయోపవేశం ప్రారంభించిన మహాకార్యపు బాధను రోజురోజూ సానుభూతి తెలుపుతున్నాను. మహాత్మాగాంధీ, కాంగ్రెసు నాయకులు, కాంగ్రెసు ప్రభుత్వాలు భాషా రాష్ట్ర నిర్మాణమే తమ మతమని పలుమారు ప్రకటించి ఈ సందర్భంలో ఎందుకు అలస్యం చేస్తున్నారో నాకు అగోచరంగా ఉన్నది. స్వాతంత్ర్యం రాకముందు,వచ్చిన తర్వాత ఆదర్శాల విలువలు మారినట్లు ఉన్నవి. సత్వరమే ఆంధ్రరాష్ట్రం ఏర్పడాలని నా అభిలాష. మీతపస్సు ఫలించాలనీ, మీకు జయం ప్రాప్తించాలని కోరుతున్నాను.

#### మద్రాసునగరం : సోషలిస్టులు

మద్రాసునగర భావిప్రతిపత్తిని గూర్చి జయప్రకాశ నారాయణగారు మొన్నను ఆంధ్ర, తమిళ సోషలిస్టులతో సంప్రతించారు. మద్రాసు రాజధానిగా తమిళరాష్ట్రం ఏర్పడాలని తమిళ రాష్ట్ర సోషలిస్టులు పార్టీవారు కోరినారు. నగర సోషలిస్టులు మద్రాసుకు స్వతంత్ర ప్రతిపత్తి ఉండాలని కోరినట్లు తెలుస్తోంది. ఆంధ్రరాష్ట్ర సోషలిస్టులు పార్టీవారు మద్రాసు భవిష్యత్తు నిర్ణయం మధ్యవర్తిత్వంవల్ల తేలాలని కోరారు. ఈ భిన్నదృక్పథాలను విని ఆంధ్రులు కోరుతున్నది న్యాయంగా,సమంజసంగా ఉన్నదనీ, దానికి ఎవ్వరూ ఆక్షేపించ నవసరం లేదని జయప్రకాశ నారాయణగారు అభిప్రాయం చెప్పారని తెలుస్తోంది.

### బసవయ్య దుర్గాంబ దీక్షా విరమణ

స్వామీజీ ప్రకటన

గుంటూరు, సెప్టెంబరు 18: వినయాశ్రమానికి యాలస్తంభాలైన తుమ్మల బసవయ్య, దుర్గాంబల శక్తి పూర్తిగా ఉడిగి పోవుటచే ప్రాయోపవేశం విరమించ వలసిందిగా నిన్న అనుమతి యిచ్చానని స్వామి సీతారాంగారు వెల్లడించారు.

"పరిస్థితి చక్కబరచడం డాక్టర్లకు కూడా కష్టసాధ్యమైన పనే. ఇంతటితో వీరు ప్రాయోపవేశం విరమిస్తున్నారు." అని స్వామీజీ తెలిపారు.

హాస్పిటల్‌లో చేర్పబడినమద్దు సేటికి ప్రమాదస్థితి తొలగిపోయింది.

తెలంగాణా ప్రముఖుడు, నిర్మాణ కార్యకర్త బి. వి.యం. ప్రసాదరావు ఆంధ్ర రాష్ట్ర నిర్మాణోద్యమాన్ని నల్గొండజిల్లాలో సాగిస్తున్నారు. ఆంధ్రదీక్షా దినోత్సవ సందర్భాన 9 వ తేదీన ఆయన నిరశనవ్రతం ప్రారంభించారు. మిత్రుల ప్రోత్సాహంవల్ల ఆయన యిక్కడకు వచ్చి దీక్ష కొనసాగిస్తున్నారు. నిన్న 22 మంది ఉపవాసం చేశారు.

### ఉపయజ్ఞశాల

తెనాలి, సెప్టెంబరు 18: ఇచట రామలింగేశ్వర పేటలో బ్రహ్మాండం నరసింహాంగారి ఆవరణలో జరిగిన బహిరంగసభలో ఉపయజ్ఞశాలను స్థాపిస్తూ, ఆంధ్రరాష్ట్రం సిద్ధించేవరకూ, యీ యజ్ఞశాలను నిర్విఘ్నంగా నడుపుటకు తీర్మానించడమయినది.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు వెంటనే అవసరమైన చర్యలు తీసుకొని స్వామి సీతారాం సంకల్పమును సిద్ధింపచేయాలని కోరుతూ మరో తీర్మానంచేశారు. ఈ యజ్ఞశాలలో ప్రతినిత్యము ఉపవాస వ్రతులను స్థానిక వైద్య ప్రముఖుడు బలిజేపల్లి పుల్లయ్యగారు పరీక్షిస్తున్నారు. నలగొండ బాబురావుగారు 9 రోజులనుండీ ఉపవాసం చేస్తున్నారు. స్వ. వి.

## అఖిలాంధ్ర నాయకుల సమావేశం వాయిదా

### వీలుచూసుకొని వినయాశ్రమంలోనైనా, మరెక్కడనైనా ఏర్పాటుచేస్తానని స్వామిప్రకటన

(స్వకీయవిలేఖరి)

గుంటూరు, సెప్టెంబరు 18: నిన్న సాయంకాలం యిక్కడ జరుప నిర్ణయించిన అఖిల ఆంధ్ర నాయకుల సమావేశం వాయిదా వేయడమైనదని, స్వామి సీతారాంగారు నేడు ప్రకటించారు.

"ఆంధ్ర నాయకులలో కొందరు రాష్ట్రనిర్మాణం విషయమై తమ తమ అభిప్రాయాలు పంపించారు. కాని, డా॥ పట్టాభి సీతారామయ్య, ప్రకాశం పంతులుగార్లవంటి ప్రముఖ నాయకులు రాకుండా సాధించగలిగే దేమీలేదు. మిగతా నాయకులుకూడా సమావేశానికి రాలేదు. వారి మనోభిప్రాయాలేమిటో నేను గ్రహించగలను. గుంటూరులో యిప్పుడేర్పడిఉన్న ఉద్రిక్త వాతావరణంలో శాంతియుత పరిష్కారం సాధ్యంగాదేమోనని వారి తలంచి ఉండవచ్చు. కాబట్టి నేనీ సమావేశాన్ని వాయిదా వేయుటకు నిశ్చయించాను. భగవదనుగ్రహం ఉంటే, వాతావరణ ప్రశాంతతఉండే వినయాశ్రమంలోగాని, మరెక్కడైనా గాని, ప్రముఖ ఆంధ్ర నాయకుల ప్రయాణానుకూలమును బట్టి, సమావేశాన్ని యేర్పాటుచేస్తాను." అని స్వామి సీతారాంగారు తమ ప్రకటనలో తెలియజేశారు.

మద్రాసు, సెప్టెంబరు 18: ఎన్నికలగూర్చి వివరాలు ఆలోచించడానికి 22, 23 తేదీలలో మద్రాసులో కలెక్టర్ల సమావేశం జరుగుతుంది. ముఖ్యమంత్రి, ఎన్నికల మంత్రి హాజరై కర్తవ్యాన్ని తెలియజేస్తారు.



## బ్రిటన్‌కు అంత్య సందేశాన్ని పర్షియాస్వయంగాపంపేసూచన

### అవిరెల్ హారిమన్ నిరాకరణ ఫలితం: త్వరలో మొసాదిక్ ప్రభుత్వంలో మార్పులు

టెహరాన్, సెప్టెంబరు 17: అధ్యక్షుడు ట్రూమన్ ప్రత్యేక రాయబారి అవిరెల్ హారిమన్, పర్షియా ప్రధానమంత్రి డా॥ మహమ్మద్ మొసాదిక్ అంత్యసందేశాన్ని బ్రిటిష్‌వారికి అందజేయడానికి నిరాకరించినట్లు, ఈ వేళ యిక్కడ అధికారులవల్ల తెలియవచ్చింది. డా॥ మొసాదిక్‌కు హారిమన్ ఈ విషయమై వివరంగా ఒక ఉత్తరంకూడా వ్రాశాడని వారు చెప్పారు. హారిమన్ ఈ నిరాకరణను బట్టి, ఆయన ఈ పర్షియా - బ్రిటన్ వివాదంలో మధ్యవర్తిత్వాన్ని విరమించుకుంటున్నట్టుగా అర్థం తీయరాదని అమెరికా ప్రభుత్వ ప్రతినిధి ఒకడు ఈ వేళ నొక్కిచెప్పాడు.

సెప్టెంబరు మాసాంతంనుంచి సుమారు 18 వేలమంది పర్షియన్ కార్మికులనూ, 1500 మందో 2 వేల మందో పెర్షియన్ గుమాస్తాలనూ, ఉద్యోగాలనుంచి తాము సస్పెండు చేయదలచుకొన్నట్లు ఆంగ్లో - ఇరానియన్ ఆయిల్ కంపెనీవారు ఈ వేళ ప్రకటించారు.

లోగడ సస్పెండు చేయబడినవారితోపాటు సెప్టెంబరు మాసాంతంనుంచి సస్పెండు అయేవారికి కూడా పెర్షియన్ బోర్డుజీతాలు ఇవ్వాలని నిశ్చయించుకొన్నట్లయితే, ఇందు నిమిత్తం వారు నెలకు 5 లక్షల పౌన్లదాకా ఖర్చు చేయవలసి వుంటుంది.

అబదాన్‌లో తను చేతిక్రింద మొత్తం 80 వేలమంది పెర్షియన్ సిబ్బంది పని చేస్తున్నట్లుగా ఆంగ్లో-ఇరానియన్ ఆయిల్ కంపెనీవారు ఇదివరకొకసారి ప్రకటించారు.

కొన్ని అత్యవసరమైన డిపార్టుమెంటులను నడిపేందుకు 7 వేలమంది పెర్షియన్ సిబ్బందిని మాత్రం కంపెనీ ఉంచుకోదలచినట్లు ఒక ఉద్యోగి ఈ వేళ వెల్లడించాడు.

మొసాదిక్ అంత్య సందేశాన్ని బ్రిటన్‌కు అందజేయడానికి హారిమన్ నిరాకరించాడుగనుక, దానిని పెర్షియా ప్రభుత్వమే బ్రిటిషు ప్రభుత్వానికి సూటిగా అందజేయవచ్చునని డిప్యూటీ ప్రధాని ఫతేమీ ఈ వేళ అన్నాడు. మందు కర్తవ్యాన్ని చర్చించడానికి పెర్షియా మంత్రివర్గం ఈ వేళ ఇక్కడ సమావేశం అయింది.

మొసాదిక్ ప్రభుత్వాన్ని పడగొట్టడానికి కుట్రలు జరుగుతున్నాయనే వదంతులు నిరాధారాలని టెహరాన్ పోలీసు అధిపతి అధికారరీత్యా ప్రకటించాడు.

#### పర్షియన్ మంత్రివర్గంలో మార్పులు?

టెహరాన్, సెప్టెంబరు 17: పర్షియా మంత్రివర్గంలో మార్పులు వచ్చేవారం జరుగగలవని డా॥ హుస్సేన్ ఫతేమీ నేడు ప్రకటించారు.

పర్షియా శ్రీ ముఖాన్ని బ్రిటన్‌కు అందజేయడాన్ని హారిమన్ నిరాకరించడాన్ని గూర్చి మాట్లాడుతూ, అది నిరాకరించడంకాదు,అందులో కొన్ని మార్పులు చేయవలసిందని ఆయన కోరారని డా॥ ఫతేమీ వెల్లడిచేసారు.

### పటేల్ స్మారకనిధి వసూళ్ల బిల్లు ప్రతిపాదన

ఢిల్లీ, సెప్టెంబరు 18: లిమిటెడ్ కంపెనీలు సర్దార్ పటేల్ జాతీయ స్మారకనిధి మున్నగు జాతీయనిధులకు విరాళాలిచ్చేందుకు అవకాశం కల్పించే బిల్లునొకదానిని హోంశాఖ మంత్రి శ్రీ సి. రాజగోపాలాచారిగారు నేడు పార్లమెంటులో ప్రతిపాదించారు. ఇట్టినిధులకు విరాళాలిచ్చేందుకు న్యాయ శాస్త్రరీత్యా యిప్పుడున్న ప్రతిబంధకాలను ఈ బిల్లు తొలగిస్తున్నది.

### జైన విగ్రహం విపరీత పరిస్థితి

సూరత్, సెప్టెంబరు 17: ఇచ్చట ఒక జైన దేవాలయంలో ఒకానొక జైన పరివ్రాజకుని విగ్రహం ఆదివారం మధ్యాహ్నం నుంచి ఇటూఅటూ తెగవూగడం ప్రారంభం అయిన కారణంగా జనం తండోపతండాలుగా వచ్చి చూచిపోతున్నారు.

జైన మతస్థులైన పెద్దలు ఇది ఏదో ఉపద్రవాన్నే సూచిస్తున్నదని అంటున్నారు.

వస్తున్న జనం యొక్క సమృద్ధం ఎక్కువై అలయం పడిపోయేటట్లుగా వున్నందువల్ల స్వచ్ఛంద సేవకులు జనాన్ని అదుపులో వుంచడానికి ప్రయత్నాలు చేస్తున్నారు. ఈ దేవాలయం ఒక భవనం మొదటి అంతస్థులో వుంది. విగ్రహం ఇటునుంచి అటు, అటునుంచి ఇటు ఊగుతున్నది.

## హిందూ న్యాయశాస్త్ర క్రోడీకరణ బిల్లుకు ముఖర్జీ ప్రాతికూల్యం

### పార్లమెంటు సభ్యుల సవరణల ప్రతిపాదన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 17: హిందుకోడు బిల్లు రెండో అంశాన్ని గూర్చి నేడు పార్లమెంటులో చర్చ ప్రారంభమైన సందర్భంలో డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీ దాన్ని తీవ్రంగా విమర్శించారు.

బిల్లును ఇష్టపడిన వారిపట్ల అనువర్తింపజేస్తూ ఇష్టంలేనివారిపట్ల అనువర్తింప చేయకుండా వుంచే పక్షంలో దీనికి అభ్యంతరం చెప్పేవారు ఎవరూ వుండరని ఆయన వాదించారు. బిల్లులో వివాహాలను గూర్చిన అంశం వుంది. అది భారతీయ వివాహధర్మం యొక్క పావిత్ర్యాన్ని, మూల సూత్రాలను విచ్ఛేదించేదిగా వుంది. అందువల్ల దీన్ని ఇష్టమైనవారు అనుసరించవచ్చు. లేనివారు లేదు; అని ప్రవర్తింపచేస్తే ఒక్కరోజులో పార్లమెంటు దీన్ని ఆమోదిస్తుంది అని డా॥ ముఖర్జీ అన్నారు.

ఏకపత్నీవ్రత ధర్మాన్ని అంగీకరించడానికి నాకేమీఅభ్యంతరంలేదు; అయితే దాన్ని ఒక్క హిందువులకే గాక, అన్ని మతాల వారిపట్ల అనువర్తింప చేయాలి. కాని ప్రభుత్వం అట్లా చేయగలదా? ముస్లిం మతాన్ని సంస్కరించడానికి ప్రభుత్వం ధైర్యముతో ముందుకు వస్తుందా? అప్పుడు కొంపలు అంటుకు పోతాయని ఈ ప్రభుత్వ భయం. హిందువులన్నా, వారి ధర్మాలన్నా అసలు ఖాతరులేదు. ఫలితాలు ఎంత దుష్టాలుగా పరిణమిస్తే ఏమి? వాటితో ప్రభుత్వానికి నిమిత్తము లేదు. హిందూమతం నిూద కుక్కలమీద పడిచినట్లు పడవటమే పని అని ఆయన అన్నారు.

ఈ అంశానికి మొత్తం 80 సవరణలు ప్రతిపాదింపబడినాయి. ఇందులో చాలాభాగం, బిల్లునుంచి సిక్కు, జైనము మొదలైన మతాలను తొలగించాలని, లేకపోతే బిల్లును పాటించే వారిపట్ల మాత్రమే అనువర్తింపజేయాలని కోరేవిగా వున్నాయి.

ఈ రెండో వాదాన్ని డా॥ ముఖర్జీ సమర్థిస్తూ వాదించారు. ఈ సందర్భంలో ఆయన స్వయంగా పునోగమన శీలురం అనుకుంటూ వుండేవారిని కూడా తీవ్రంగావిమర్శించారు. తాము ఏది అనుకుంటున్నది తప్ప తక్కిన ప్రపంచం ఏమీలేదన్న భావం వీరిలో దిట్టంగా అలుముకొనివుంది. ఆ భావంతో ఏ మాత్రం వ్యతిరేకించినవారు కనపడ్డా వీరిదృష్టిలో వారంతా అభివృద్ధి నిరోధకులై పోతున్నారు. దాని సంగతి అట్లావుంచండి. వారు మంచిది, అభ్యుదయకరమైంది అనుకుంటున్న విషయాన్ని పట్టుకుని యిందుపపోతామంటే కాదనడం మా పనికాదు. అయితే, ఇతరులు దేన్ని పవిత్రమని నమ్ముతున్నారో,వారిని అట్లా అనుకోనీయండి. వారినికూడా మీతోపాటు రమ్మనడం దేనికి? వారిదృష్టిలో భారతీయవివాహధర్మం చాలా పవిత్రమైంది. ధర్మనిష్ఠమైంది. న్యాయమైంది. మా నవ ప్రవర్తనకు గీటురాళ్లుగా చెప్పబడే సర్వప్రమాణాలలోను ఉత్తుంగతరమైంది.

ఈ విధంగా హిందూకోడ్ బిల్లు అభ్యుదయకరమైంది కాదు. అదివట్టి ప్రతీప ధర్మాన్ని ప్రతిపాదిస్తున్నది. దీనివల్ల ఎవరికీఏమీ మేలుజరుగదు. దేశంభిన్నాభిన్నం అయిపోవడానికితప్ప మరెందుకు పనికిరాదు. విడాకులు మంచిదనే వాళ్లు కొంతమంది వుంటారు. అది అభివృద్ధిఅని వారిభావం కాని యీ విడాకులధర్మం బాగా వ్యాప్తిలో వున్న పాశ్చాత్య దేశాలలో సాంఘిక సమస్యలేమన్నా దీనివల్ల పరిష్కారం అయినాయా అంటే అదేమీ కన్పించదు.

డా॥ బ్రజకిశోర్ సిన్హా, మాట్లాడుతూ, ప్రస్తుత పరిస్థితులలో విడాకుల ధర్మాల్ని గనుక నెలకొల్పక పోతే, హిందూ సంఘం పతనం చెందేమాట నిజమని వాదించారు. డా॥ ముఖర్జీ అంటున్నట్లు హిందూ వివాహధర్మం అంత విడగొట్టరానిది కాదని, తనకు కొన్ని సంస్కృత గ్రంథాలలో అట్టి విడగొట్టిన వివాహ ధర్మాలు కన్పించాయని ఆయన అన్నారు. స్వతంత్రతను గూర్చి కొన్ని భావాలు దేశంలో వ్యాప్తిలోకి వచ్చాయి. అవి స్త్రీలను, పురుషులనుకూడా పూగించి వేస్తున్నాయి. వాటిని గనుక మనం గుర్తించ లేకపోతే, హిందూ ధర్మాన్ని బ్రతికించలేమనే నా అభిప్రాయం అని శ్రీ సిన్హా వ్యాఖ్యనించారు.

డా॥ దేశముఖ్ మాట్లాడుతూ, బిల్లులోని ముఖ్యాంశాలు తనకు నచ్చినాయని అయితే వాటిని అమలుజరిపే సమయంగాని,అంత తీవ్రంగా హిందూ సమాజాన్ని మార్చేస్థితిగాని ఇంకా రాలేదని స్పష్టం చేశారు. ఆయన ఉపన్యాసం పూర్తి కాకముందే సభ ముగిసింది. తిరిగి మంగళవారంనాడు చర్చ జరుగుతుంది.

#### కాంగ్రెస్‌నుంచి యు. పి. శాసనసభ్యుని రాజీనామా

లక్నో, సెప్టెంబరు 17: యు. పి. లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడు శ్రీ వేణీమాధవతివారీ కాంగ్రెస్‌పార్టీనుంచి రాజీనామా ఇచ్చి కిసాన్‌మజ్దూర్ ప్రజాపార్టీలో చేరారు.

## కృష్ణా పెన్నార్ ప్రాజెక్టు

### పునఃపరిశీలన చేసి నెలాఖరున కొత్త అంచనాలను మద్రాసు ప్రభుత్వం పంపుతుందట

ఢిల్లీ, సెప్టెంబరు 17: కృష్ణా పెన్నారు ప్రాజెక్టుకు అయ్యేటటువంటి ఖర్చుయొక్క అంచనా లెక్కలను పునః పరిశీలనచేసి యీ రివైజ్డ్ స్కీమును యీ సెప్టెంబరు నెలాఖరులోగా ఇండియా ప్రభుత్వమునకున్ను ప్లానింగుకమిటీకిన్నీ మద్రాసు ప్రభుత్వం సమర్పింప బోవుచున్నది. ఈ పునః పరిష్కృతి అంచనా మదింపులను బట్టి యీ కృష్ణా - పెన్నారు ప్రాజక్టుకు రూ 133 కోట్లు ఖర్చు అగును. ఈ స్కీముయొక్క స్వరూపమును స్థూలంగా సూచిస్తూ పంచవర్ష ప్రణాళిక ప్లానింగు కమిటీకిన్నీ, కేంద్ర ప్రభుత్వానికిన్నీ యిదివరకే సమర్పింపబడింది. ఈ ప్రాజెక్టుగూర్చి చర్చించడానికి వివిధరాష్ట్ర ప్రభుత్వముల సమావేశము గతమాసం ఢిల్లీలో జరిగింది. ఆ సభా సమావేశ ఫలితంగా యీ స్కీమును పునః పరిశీలించి కొత్త మదింపు లెక్కలు తయారుచేయుట సంభవించింది. సంస్కరింపబడిన యీ స్కీము ప్రకారముగా ఒక ఆనకట్ట కృష్ణానదికి సిద్ధేశ్వరం వద్దను, రెండవ ఆనకట్ట పెన్నానదికి సోమేశ్వరం వద్దను నిర్మించవలెను. రెండు పెద్ద జలాశయములను

(2-వ పేజీ చూడుడు)

## విభజనసంఘశిఫార్సుకు ఆక్షేపణ తెలుపనని స్వామిసీతారాంహామీ

### మద్రాసు భవిష్యత్తుపై మధ్యవర్తి పరిష్కారాన్ని కూడా కోరనని చెప్పినట్లు రంగాగారి ప్రకటన

మద్రాసు, సెప్టెంబరు 18: మదరాసునగర భవిష్యత్తుపై మధ్యవర్తి పరిష్కారాన్ని కోరనని,స్వామి సీతారాం గారు తనతో చెప్పినట్లు, యన్. జి. రంగాగారు నేడు పత్రికా విలేఖరుల సమావేశంలో వెల్లడించారు.

ఆంధ్ర రాష్ట్రం తక్షణం యేర్పాటు చేయవచ్చునని చెబుతూ రంగాగారిలా అన్నారు:

మద్రాసు నగరం మినహా ఆంధ్ర జిల్లాలతో ఆంధ్రరాష్ట్రం యేర్పాటు చేయాలని జె. వి. పి. నివేదికలోని శిఫార్సులను, ఆంధ్ర తమిళ కర్ణాటక కాంగ్రెసు సంఘాలు తదితరులు ఆమోదించి ఉండడంచేత, వెంటనే ఆంధ్ర రాష్ట్రనిర్మాణానికిగల అభ్యంతర మేమీ నాకు బోధపడడం లేదు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం 11-11-49 న సమావేశమై జె. వి. పి. నివేదికను ఏకగ్రీవంగా ఆమోదించింది తమిళనాడు కాంగ్రెసు కార్యవర్గం కూడా నివేదికను ఆమోదించింది. దానిపై భారత ప్రభుత్వం రాష్ట్ర నిర్మాణానికి పూనుకొన్నది. కాని ఆ తరువాత విభజనసంఘ చర్చల సందర్భంలో ఆర్థికాది విషయాలపై భేదాభిప్రాయం వచ్చింది. వివాదగ్రస్తమైన యీ విషయాలను మధ్యవర్తి పరిష్కారానికి నివేదించి, రాష్ట్ర నిర్మాణానికి పూనుకోవడానికి అభ్యంతరం మేమిటి. పార్లమెంటులోని ఆంధ్ర సభ్యులు, ఢిల్లీలో భారత ప్రధానికి కలుసుకొన్నప్పుడు చెప్పినదిగూడా యిదే!

స్వామిజీ కలుసుకొని నేను అడగ్గా, మద్రాసు వివాదాన్ని పునఃప్రారంభించబోనని, మద్రాసు విషయంలో యింతవరకు జరిగిన నిర్ణయాలను ఆక్షేపించబోనని చెప్పారు. అందువల్ల మద్రాసునగరం విషయం మధ్యవర్తి పరిష్కారానికి నివేదించాలన్న ప్రసక్తే రాదు. కాబట్టి మద్రాసు లేకుండా ఆంధ్ర రాష్ట్రం యేర్పాటు చేయవచ్చు."

విభజన సంఘనివేదిక శిఫార్సులను మీరు ఒప్పుకుంటారా? అన్న ప్రశ్నకు సమాధానం చెబుతూ, జె. వి. పి. నివేదికను నేను ఒప్పుకొన్నాను. విభజనసంఘ శిఫారసులకు, యీ నివేదిక మూలాధారం. మద్రాసు నగరంపై ఆంధ్రులు తమ హక్కు వదలుకోవాలని జె. వి. పి. నివేదిక ఖచ్చితంగా చెప్పింది. కాబట్టి మద్రాసు మినహా మిగతా వివాదగ్రస్త విషయాలను మధ్యవర్తి పరిష్కారానికి నివేదించవచ్చు" అని అన్నారు.

మరో ప్రశ్నకు సమాధానం చెబుతూ, రాష్ట్రం నిమిత్తం ప్రజలు సత్యాగ్రహంచేస్తే బాగుండునని తమ అభిప్రాయంగా చెప్పారు. స్వామి సీతారాం ప్రాయోపవేశమును సంపూర్ణంగా బలపరుస్తానన్నానని చెప్పారు.

### ఎన్నికలకు ముందే రాష్ట్రం ఏర్పర్చాలి

ఆంధ్ర ప్రజాపార్టీ తీర్మానం

విజయవాడ, సెప్టెంబరు 19: ఆంధ్ర ప్రజాపార్టీ సర్వసభ్య సమావేశం నిన్న యిచట, యన్. జి. రంగాగారి అధ్యక్షతన జరిగినది. ఈ సమావేశంలో స్వామి సీతారాం ప్రభృతుల ప్రాయోపవేశ దీక్షను ప్రశంసిస్తూ, ఎన్నికలకు ముందే ఆంధ్రరాష్ట్రాన్ని యేర్పాటు చేయుటకు భారత ప్రభుత్వము వెంటనే తగుచర్య గైకొనాలని కోరుతూ, తీర్మానాలు చేయబడినవి. "ఆంధ్రరాష్ట్ర సంపాదనకై స్వామి సీతారాం వీరోచితంగా నిర్వహిస్తున్న ఈ మహాయజ్ఞమునకు ఆంధ్రప్రజాపార్టీ వారు నైతికంగాను, భౌతికంగాను సహాయం చేస్తారు. చట్టబద్ధమయిన ప్రయత్నాలను, విఫలంకాగా, జె.వి. పి. నివేదికనూ ఆంధ్రులు ఆమోదించి నప్పటికీ, ప్రభుత్వం పెట్టిన షరతులను, సహేతుకమైనంతవరకు ఒప్పుకొన్నప్పటికీ రెండు సంవత్సరాలుగా ఆంధ్రుల న్యాయబద్ధమయిన కోర్కెలను, యూనియన్ ప్రభుత్వం నిర్లక్ష్యం చేయగా, కేవలం గాంధీ సిద్ధాంతాలు ఆధారంగా స్వామీజీ ప్రారంభించిన ఈ మహోత్కృష్టమైన సత్యాగ్రహోద్యమం పట్ల భారత ప్రధాని, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సంఘము అవలంబించిన వైఖరి చాలా శోచనీయంగా ఉన్నదని ఈ సభవారు అభిప్రాయపడుతున్నారు.

మద్రాసు నగరానికి సంబంధించి నంతవరకు, జె. వి. పి. నివేదిక శిఫార్సులకు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ సర్వసభ్య సమావేశం 11-11-49న ఏకగ్రీవంగా ఆమోదించి మర్ల 14-9-51 అవే శిఫార్సులను ఆమోదించింది. గనుక ఆంధ్ర, తమిళ, కర్ణాటక ప్రజల మధ్య తీవ్ర విభేదమేమీ కానరాదు. కాబట్టి ఎన్నికలకు ముందే ఆంధ్ర రాష్ట్రం యేర్పరుచే ఉద్దేశ్యంతో, తాము ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి నిర్దుష్టమైన చర్యలు తీసుకొంటామని భారత ప్రభుత్వం వెంటనే ప్రకటించాలని యీ సభవారు కోరుతున్నారు."

విభజన సంఘ చర్చల సందర్భంలో ఋణ్ల విషయమై వచ్చిన వివాదాలన్నింటినీ మధ్యవర్తి సంఘం ద్వారా పరిష్కరించాలని అభిప్రాయపడుతూ యీ సంఘాన్ని నియమించాలని భారత ప్రభుత్వాన్ని యీ సభవారు కోరుతున్నారు." సరిహద్దుసంఘాన్ని నియమించాలని గూడా సూచించారు.

## ధనాభావంవల్లతుంగభద్రా హైడ్రో ఎలక్ట్రిక్ ప్రాజెక్టు విరమణ

### ప్లానింగ్ కమిషన్ సిఫార్సుపై హైద్రాబాద్ ప్రభుత్వ నిర్ణయం: వెల్లోడీ ప్రకటన

హైదరాబాదు, సెప్టెంబరు 17: తలపెట్టినంత ఆర్థిక స్తోమతులేని కారణాన, ప్లానింగు కమిషన్‌వారి సిఫారసు మేరకు హైదరాబాదు ప్రభుత్వం పంచవర్ష ప్రణాళిక నుంచి తుంగభద్రా హైడ్రో ఎలెక్ట్రిక్ స్కీమును వదిలిపెట్టవలసి వచ్చిందని హైదరాబాదు ముఖ్యమంత్రి వెల్లోడీ గారు సంస్థాన ప్లానింగు బోర్డువారి రెండవ సమావేశంలో నిన్న ఉదయం మాటలాడుతూ సందర్భవశంగా వెల్లడించారు. ఈ స్కీమువల్ల సంస్థానానికి చాలా ప్రయోజనం ఉంటుందనీ,కాని సందర్భం సరిగా లేదనీ, ప్రజలు ముందుపడి ప్రభుత్వానికి సాయపడేటట్లయితే ఉపయోగ ముంటుందనీ, లేకపోతే సంస్థానానికి కావలసిన విద్యుచ్ఛక్తికి తాము పొరుగురాష్ట్రమైన మద్రాసుమీద ఆధారపడవలసి వుంటుందనీ, వారు తమస్కీము ముందుగానే పూర్తిచేస్తారని వెల్లోడీ గారు వెల్లడించారు.

### ప్రకాశంగారి ఆరోగ్యస్థితి

మద్రాసు, సెప్టెంబరు 18: టంగుటూరి ప్రకాశం పంతులుగారు శస్త్రచికిత్స జర్గిన అయిదోరోజున బలహీనంగా ఉన్నా క్రమంగా కోలుకుంటున్నారు. నేటి ఉదయం డా॥ గురుస్వామి మొదలియారుగారువచ్చి పరీక్షించి వెళ్లారు. పంతులుగారు ఇవాళ గత నాల్గురోజుల పత్రికల వార్తలను సంగ్రహంగా తెలుపవలెనని అడిగి తెలుసుకున్నారు. ఆంధ్ర సోషలిస్టు పార్టీ నాయకులు మద్దూరి అన్నపూర్ణయ్యగారు పంతులుగారిని నేడు దర్శించి నిన్న పంతులుగారి కబురు వచ్చేసరికి జయప్రకాశ్ నారాయణ గారు విమానంలో ఢిల్లీ పోయారని విన్నవించారు. ఎన్. జి. రంగా, శ్రీమతి అమ్మన్నరాజా, ఎం. పి. దామోదరన్ మున్నగువారు ప్రకాశంగారిని చూచారు.

